8. గీతలో పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నా డన్నాడు. క్రొత్తదంటే పూర్తి తయారైనదా? లేక ఆరు నెలలకు అసంపూర్ణముగ ఉన్నదా?

9. భగము (యోని) నుండి ప్రాణముతో పుట్టినపుడు అందరూ భగవంతులే అవుతారు కదా! అలా అందరము భగవంతులుగ ఎందుకు లేము?

ఇక్కడ మేము కొద్దిగ చెప్పు జవాబు ఏమంటే మన శరీరములో పంచ భూతములలో ఒకటైన వాయువు (గాలి) ఉన్నది. అది ఐదు భాగములుగ ఉన్నది. వాయువును "ప్రాణము" అనవచ్చును. అందువలననే పంచ వాయువులను పంచ ప్రాణములు అన్నారు. మన ముక్కురంధ్రములలో గాలి ఉన్నపుడే ప్రాణమున్నదని, గాలి లేనపుడు ప్రాణములేదని చెప్పడము కూడా పరిపాటి! శరీరములో ప్రాణమున్నపుడే జీవుడు కూడా ఉండును. ప్రాణము లేనపుడు జీవుడుండడు. ముక్కురంధ్రములలో శ్వాస ఆడనంత వరకు శిశువుకు ప్రాణము లేదని గ్రహించవలయును. తల్లి గర్భములో మావి అను తిత్తియందు ఉమ్మినీరు అను ద్రవములో శిశువు మునిగి ఉండును. అందువలన శ్వాస ఆడుటకు అవకాశమే లేదు. జీవుడసలే లేడు. జననము గురించి మేము అడిగిన ప్రశ్నలకు జవాబులు మీరు వెదకండి. సత్యాసత్యములు మీకే అర్థమౌతాయి. ఈ విధముగా పరిశోధనా దృష్టితో మాకు సంచలనాత్మకమైన మీకు విప్లవాత్మకమైన జనన రహస్యములు తెలిసినవని సంతోషపడువారు అదే ఉత్సాహముతో, ఎక్కడా ఎవరూ చెప్పని మరణరహస్యమును కూడా చదువగలరని కోరుచున్నాము.



# మరణము

శరీరమను యంత్రము పనిచేయకుండా నిలచిపోవడమును 'మరణము' అంటున్నాము. **'మర'** అనగా యంత్రమని అర్థము. మరణ మనగా యంత్రములో లోపమేర్పడి నిలచిపోవడమని అర్థము. యంత్రములో ఎన్నో భాగములున్నట్లు శరీరములో కూడ ఎన్నో భాగములు గలవు. యంత్రమును నడుపు డ్రైవర్ అనువాడు ప్రత్యేకముగ ఉన్నట్లు శరీరమును నడుపువాడు కూడా ప్రత్యేకముగా గలడు. యంత్రమును నడుపు వానిని డ్రైవరన్నట్లు శరీర యంత్రమును నడుపు వానిని **'ఆత్మ'** అంటున్నాము. శరీర యంత్రమును నడుపు ఆత్మ శరీరములోనే ఉండి శరీరమును నడుపడము 'జీవితము' అంటున్నాము. శరీర యంత్రములో లోపమేర్పడి నపుడు అది పనిచేయలేని స్థితికి చేరుకొన్నపుడు ఆత్మ శరీరమును నడుపడము మానివేసి మరియొక క్రొత్త శరీరమును చూచుకొనును. ఆత్మ శరీరమును వదలిపోవడము శరీరయంత్రము పనిచేయనపుడే జరుగు చుండును. శరీరయంత్రము నిలచిపోవడము 'మరణము' అని ఒక గుర్తింపుగ పేరుపెట్టారు. యంత్రము జ్ఞాపకము వచ్చినపుడు దానిని నడుపువాడు మరొకడుండునని తెలియునట్లు "మరణము" అను పేరును పెద్దలు నిర్ణయించారు. మరణములో శరీర యంత్రమును నడుపువాడు లేకుండా పోయాడను అర్థముతో పూర్వము ఆ పేరునుంచారు. ఈ విషయము ఈ విధముగా ఆధ్యాత్మిక అర్థముతో ఉండగా పురాణములలో మరొక విధముగా చెప్పడము జరిగినది. యమలోకము ఒకటున్నదని, అక్కడ యమధర్మరాజు గలడని, మనిషి ఆయుష్షు అయిపోయిన వెంటనే యమధర్మరాజు తన భటులను పంపి మనిషి ప్రాణము తీయుచున్నాడనీ, అట్లు ఒక శరీరమునుండి జీవుని వేరుచేసి తనలోకమునకు తీసుక పోవుచున్నాడని చెప్పారు. ఈ విషయములు శాస్త్రబద్ధముకావని, ఇందులో

వాస్తవము ఏమాత్రము లేదని మేము చాలామార్లు చెప్పాము. మానవునికి భయమును కల్గించుటకు యమలోకము అక్కడి శిక్షలు సృష్ఠించారు. కానీ పాపములకు శిక్ష భూమి మీదనేపడుచున్నదని చెప్పలేకపోయారు.

మరణ సమయములో జీవుడు చాలా బాధపడుననీ, మరణబాధ వెయ్యి తేళ్ళు కుట్టినట్లుండుననీ, జీవితములోని అన్ని బాధలకంటే మరణబాధ పెద్దదని పురాణములలో చెప్పియుండుట వలన చాలామంది మరణమంటే ఎక్కువ భయపడుదురు. కొందరు చెప్పినట్లు మరణ సమయములో యమకింకరులు వస్తారనీ, వారు భయంకరముగ ఉందురని మరణము రాకముందే భయపడుచుందురు. కొందరు యమలోకములోని బాధలు ఇట్లుండునంట అని ముందే తలచుకొని బాధపడువారు గలరు. ఇన్ని అపోహలతో కూడుకొన్న మరణమును గురించి శాస్త్రబద్ధముగా తెలుసు కోవడము మంచిది. హేతుబద్ధముగా మరణమును గురించి వ్రాయాలంటే ఆ సమయములో శరీరమునందు ఏమి జరుగుచున్నదో పరికించి చూడవలయును. మరణమును గురించి వ్రాయాలంటే ఒకమారు చనిపోయి అప్పుడు ఏమి జరుగుచున్నదో చూచిన వాడే వ్రాయగలడు. అలా వ్రాయుటకు చనిపోయిన వాడు తిరిగి పుట్టినప్పటికీ వానికి మరణము యొక్క విషయము జ్ఞాపకముండదు. జీవునికి తాను శరీరము ధరించి ఎలా పుట్టానను విషయము కూడ జ్ఞాపకముండదు. చావు తర్వాత వచ్చిన పుట్టుక విషయమే తెలియని జీవుడు పుట్టుక కంటే ముందు జరిగిన మరణము యొక్క విషయము నెలా చెప్పగలడు? చావు పుట్టుకల గురించి జీవుడు చెప్పుటకు అవకాశమే లేదు. కావున జనన మరణములు రెండూ రహస్యములనే చెప్పవచ్చును. అలాంటపుడు అవి రహస్యములుగనే ఉండి పోతే మనిషి తన ఇష్టమొచ్చినట్లు ఊహించుటకు అవకాశము గలదు.

భూమి మీద లేని క్రొత్తవిషయములు, మనిషికి ఏమాత్రము తెలియని క్రొత్తవిషయములు, మనిషి ఊహించుటకు కూడ చేతగాని విషయములు ఎన్నో మనిషి ద్వారా బయటికి వచ్చాయి. ఉదాహరణకు దూరదర్శనము (టి.వి)లు, దూరశ్రవణము (రేడియో)లు, కంప్యూటర్లు, రైళ్ళు, విమానములు మొదలగునవి ఎన్నో మొదట మనిషికి తెలియని విషయములే! ఎన్నో అద్భుతమైన విషయములు మనిషి ద్వారా బయటికి వస్తూనే ఉన్నవి. ఇవన్నియూ శాస్త్రబద్ధ, హేతుబద్ధ విషయములే. అలాంటపుడు రహస్యములుగ తెలియకున్న జనన మరణములు శాస్త్రబద్ధముగ తెలియలేమా! తెలియవచ్చును. మనిషి కనుగొనిన క్రొత్త సూత్రములన్నియు మనిషి ఎలా కనుగొన్నాడో విశదపరచుకొని చూచి నట్టయితే దాని ప్రకారమే మిగతా విషయములు కూడ కనుగొన వచ్చునని తెలియుచున్నది. మనిషి శరీరములో **జీవుడు** గలడు, **ఆత్మ** గలదు మరియు **పరమాత్మ** గలదు. ఒకే శరీరములో ముగ్గురున్నారు అను విషయము కొంత క్రొత్తగ ఉండినప్పటికీ అది అందరికీ తెలియని వాస్తవమేనని చెప్పవచ్చును. శరీరములో ముగ్గురున్నారను విషయము శాస్త్ర బద్ధమైనది. బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతలో స్వయముగా భగవంతుడే ఈ విషయమును తెలియజేశాడు.

మనిషి ఎన్నో క్రొత్త విషయములను కనుగొన్నపుడు దానికి ఒక సిద్ధాంతమని పేరు పెట్టడము, ఆ సిద్ధాంతమును తానే కనుగొన్నట్లు సిద్ధాంతము ముందర తనపేరే ఉంచుకోవడము జరుగుచున్నది. ఉదాహరణకు న్యూటన్ సిద్ధాంతము, డార్విన్ సిద్ధాంతము అలాంటివే. ఒక మనిషి ఒక క్రొత్త విషయమును కనుగొన్నట్లు మనము కూడ ఒప్పు కొంటున్నాము. అయినప్పటికీ బాగా ఆలోచిస్తే ఇక్కడొక ప్రశ్న రాగలదు.

అదేమనగా శరీరములో ఉన్నది ముగ్గురు కదా! అలాంటపుడు ఒక క్రొత్త విషయము మనిషినుండి బయటికి వస్తే ఆ విషయమును ఉన్న ముగ్గురిలో ఎవరు చెప్పారు? దీనిని ప్రశ్నకాదని మనమనలేము. ఒక ఇంటిలో ముగ్గురు నివాసము చేస్తున్నపుడు, ఆ ఇంటినుండి ఒక పెద్ద సహాయము బయటి వారికి అందినపుడు, ఆ ఇంటిలో ఎవరి ద్వారా ఆ సహాయము అందినదో తెలుసుకోవడము బయటివారి పని. ఈ సహాయము అందించినదెవరు? అని ప్రశ్న వచ్చినపుడే ఒకే ఇంటిలో గల ముగ్గురి మీదికి మన దృష్టి పారుతుంది. చివరకు ఎవరు అందించినది తెలియబడుతుంది. ఇంటిలో నున్న ముగ్గురిలో ఎవరికి ఎంత స్థోమతున్నది, ఎవరికి సహాయము చేయు శక్తి గలదో తెలుసుకొంటే ముగ్గురిలో సహాయము చేసినవానిని సులభముగ గుర్తించవచ్చును.

శరీర గృహములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురు నివశిస్తున్నారు. శరీర గృహము నుండి ఒక రహస్యము బయటపడినపుడు శరీరములోని ముగ్గురిని విశదముగా పరిశీలించవలసిన అవసరమున్నది. ముగ్గురున్న విషయము తెలియకపోతే అసలు ఎవరు చెప్పినది తెలియక పోవును. అందువలన ముగ్గురున్న విషయము ముందు తెలుసుకొని ఆ ముగ్గురి సమాచారము వివరముగ తెలుసుకోవాలి. శరీరములోనున్న ముగ్గురిలో మొదటివాడు జీవాత్మ. శరీరములో జీవుడనే వాడే మనము. శరీరములో 'నేను' అను భావముతోనున్న వాడే జీవుడు. శరీరములో ఏ పని జరుగుచున్ననూ, అన్నీ నేను చేశానని అనుకొనువాడే జీవుడు. వాస్తవానికి ఈ జీవుడెవరు? శరీరములో వీని కర్తవ్యమేమిటి? శరీరములో ఎందుకున్నాడు? ఇలాంటి మొదలగు ప్రశ్నలకు జవాబు కావాలంటే జీవుని గురించి వివరముగ తెలుసుకొందాము.

ప్రపంచములో ఎన్నో స్థితిగతులయందున్న మనుషులలో జీవాత్మ ఉంటూ తాను పైన ఉన్నటువంటి స్థితిని బట్టి, హోదాను బట్టి నేను మంత్రిననో, నేను ఆఫీసర్‌ననో, ధనికుడననో, బీదవాడిననో తలపోయు చున్నాడు. వాస్తవముగ జీవునికి బయటి స్థితికి ఏమీ సంబంధము లేదు. శరీరములో జీవుడు శరీరమంతట లేకుండా కేవలము ఒక్కచోట మాత్ర మున్నాడు. శరీరములో జీవుని పరిమాణము మనిషి శరీరములోని 31,104వ భాగమని ఒక లెక్కగలదు. (ఈ లెక్క తెలియాలంటే మా రచనలలోని **"నిగూఢ తత్త్వార్థబోధిని"** అను గ్రంథములో 93వ పద్యము యొక్క భావము చూడవలెను) మనిషి శరీరములో కొన్ని వేలరెట్లు చిన్నవాడైన జీవున్ని కొన్ని సందర్భములలో **'నీవు రవ్వంతలేవు'** అనడము కూడ జరుగుచున్నది. ఎంతో చిన్న ఆకారము కల్గిన జీవుడు శరీరములో ఏ పనీ చేయడము లేదు. తాను శరీరములో ఉన్నది కేవలము శరీరములో జరిగెడి పనుల అనుభవములు అనుభవించేదానికి మాత్రమే. సుఖదుఃఖములను అనుభవించుటకు మాత్రమే జీవుడు శరీరములో గలడు. జీవునికి బయటి హోదాలకు సంబంధము లేదు. శరీరములో ఏ పనీ చేయని, ఏహోదాకు సంబంధములేని జీవుడు మాత్రము బయట హోదా తనదేనని అన్ని పనులు చేయుచున్నది తానేనని తలచుచుండును. శరీరములోని జీవుడెట్లు తలచిన జరుగుచున్న పనులకుగానీ, బయటి హోదాలకుగానీ, చేయుచున్న ఆలోచనలకు గానీ, కనిపెట్టిన రహస్యములకుగానీ ఏమాత్రము సంబంధము లేనివాడై ఉన్నాడు. నాస్థితి ఇది అని, నేను ఏమీ చేయలేదని, ఏ పనిగానీ, చెప్పబడు విషయముగానీ నాకు సంబంధము లేదని జీవుడు అనుకోవడము లేదు. జీవునికున్న అజ్ఞానము వలన తన స్థితిని గానీ, తన పరిమాణమును గానీ, శరీరములోని తన నివాసస్థలమును గానీ తెలియలేక పోయాడు. కర్మలను అనుభవించుటకు మాత్రము శరీరములో గలనని, మిగతాదేదీ

తనకు సంబంధమే లేదని తెలియక పోవడము వలన జరిగిన పనిని నేనే చేశానని అనుకుంటున్నాడు. అలాగే కనిపెట్టబడి బయటికి తెల్పిన రహస్యమును తానే చెప్పానని ఆ సిద్ధాంతము తనదేనని పొరబడుచున్నాడు. నిజ జ్ఞానము ప్రకారము జీవుడు శరీరములో అస్వతంత్రుడు, అనామకుడు, కర్మబద్ధుడై కర్మను అనుభవించువాడు.

ఒకటవ ఆత్మయిన జీవాత్మకు శరీరములో జరిగెడి పనులకు ఏ సంబంధము లేదని, తనవరకు వచ్చిన దానిని అనుభవించుట తప్ప మరి ఏ కార్యము లేదని తెలుసుకొన్నాము. మొదటిదయిన జీవాత్మ అలా ఉండగ చివరిదయిన పరమాత్మ కూడ దాదాపు జీవాత్మవలె ఏమీ చేయక ఉన్నది. జీవాత్మ ప్రారబ్ధకర్మను అనుభవిస్తూ, అహముచేత ఆగామికర్మను సంపాదించుకొనుచున్నది. పరమాత్మ అలా కర్మను అనుభవించడమూలేదు, సంపాదించుకోనూలేదు. జీవాత్మ శరీరములో ఒక్క చోట మాత్రము గలదు, పరమాత్మ శరీరమంతటా వ్యాపించియుండి శరీరము బయట కూడ వ్యాపించి ఉన్నది. జీవాత్మకు ఆకార పరిమాణములుండగ, పరమాత్మకు ఆకారము లేదు, పరిమాణము లేదు. శరీరములో పరమాత్మ ఏకార్యము చేయక ఊరక ఉన్నాడని చెప్పవచ్చును. జీవాత్మ మాదిరి జరిగిన పనులకు కర్తను నేనని అనుకొనువాడు కాదు. జీవాత్మ చేయక మరియు పరమాత్మ కూడ చేయకపోతే మనిషి ఎలా పనిచేయుచున్నాడని చాలామందికి ప్రశ్న రావచ్చును. దానికి సమాధానము ఏమనగా! ఇంతవరకు ఆధ్యాత్మిక విద్యలో ప్రచారముగాని ఆత్మ కూడ శరీరములో ఒకటున్నది. అదియే మొదటి జీవాత్మకు, మూడవ పరమాత్మకు మధ్యలోగల రెండవ ఆత్మ. చాలామందికి జీవుడొకడున్నాడని, పరమాత్మయిన దేవుడొకడున్నాడని తెలుసును గాని రెండిటికి మధ్యలో గల ఆత్మ ఒకటున్నదని తెలియదు.

కొంతమంది వాదనలో పరమాత్మ ఒకడే ఉన్నాడనుట కూడ కలదు. ఎవరేమి చెప్పినా శరీరములో ఏమీ చేయని జీవాత్మ, పరమాత్మ ఇద్దరుండగా, అన్నీ చేస్తున్న ఆత్మకూడా గలదు. శరీరములో అన్నీ చేస్తున్న ఆత్మను గుర్తించక పోవడమే మనకున్న పెద్ద అజ్ఞానము. ఎక్కడయినా ఆత్మను పేరు వినిపించిన ఆత్మేనువ్వు, నువ్వేఆత్మని బోధించడము కూడా జరుగుచున్నది. జీవాత్మ వేరు, ఆత్మవేరు, పరమాత్మవేరు అని తెలియు జ్ఞానము మనవద్దలేక పోవడము పెద్దలోటు అని చెప్పవచ్చును.

**రెండవ ఆత్మ** ఇటు జీవాత్మకు అటు పరమాత్మకు మధ్యలో ఉండి **పరమాత్మకు ప్రతినిధిగ, జీవాత్మకు అధిపతిగ** ఉన్నది. శరీరములోని ఆత్మ శరీరమంత వ్యాపించి ఉండి అన్ని పనులు తానే చేయుచున్నది. శరీరము ద్వారా బయట జరిగెడి కార్యములను గానీ, ఎల్లపుడూ శరీరములోపల జరిగెడి కార్యములకు గానీ అధిపతి ఆత్మయే. శరీరము లోపలి అవయవములను కదిలించి ఆడించుచూ, బయటి అవయవములైన కాళ్ళు చేతులను కదిలించి ఎన్నో కార్యములు చేయుచున్న ఆత్మ ఈ పనులకంతటికీ నేనే కారణమని ఎక్కడా చెప్పుకోకపోవడము వలన ఎవరూ ఆత్మను గుర్తించుటకు వీలులేకుండా పోయినది. ఏమీ చేయలేని జీవాత్మ, అన్నీ చేస్తున్నాననుకోవడము వలన ఆత్మపాత్ర ఎవరికీ తెలియకుండా పోయినది. మనకు తెలియకున్నా తెలిసినా ఆత్మనునది ఒకటున్నది. అది శరీరములోపల, శరీరము బయట పనులు చేయడమే కాక శరీరములోని ప్రతి అవయవము నకు శక్తినిచ్చుచున్నది. తానే చైతన్యమై శరీరమంతా వ్యాపించి ఉండడమే కాక అన్నిటికీ కారణము అదియేయై ఉన్నది. జీవాత్మ పరమాత్మ రెండూ ఏమీ చేయకపోయినప్పటికీ జగతి అభివృద్ధికి, సామాజిక పురోగతికి కావలసిన యంత్రములను, తెలియని సిద్ధాంతములను, విజ్ఞాన శాస్త్ర పరిశోధనను ఆత్మే స్మృతి ద్వారా అందించుచున్నది. తెలియని

విషయములను తానే తెల్పుచున్నది. ఈ రోజు భూమిమీద కంప్యూటర్లు మొదలుకొని ఎన్నో విజ్ఞాన పరికరములు అన్నియూ ఆత్మ యొక్క స్మృతి ద్వారా తెలిసినవేనని తెలియాలి. ఈ విషయము శాస్త్రబద్ధమైన దని తెల్పుటకు ఆధారము కూడ కలదు. భగవద్గీతా శాస్త్రములో పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయములో పదిహేనవ శ్లోకములో **"సర్వస్య చాహం హృది సన్ని విష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ"**, అని ఆత్మ విధానము చెప్పబడినది. స్మృతి, జ్ఞానము, ఊహ అన్నీ ఆత్మ వలననే కల్గుచున్ననూ, అన్ని పనులు ఆత్మ వలననే జరుగుచున్ననూ, అజ్ఞానము చేత జీవుడు తానే చేయుచున్నానకొనుచున్నాడు. ఆత్మ తన పనిని తాను చేస్తూ పోవుచున్నది. ఆత్మచేసిన పనులనేకాక ఆత్మ అందించిన పరిశోధన జ్ఞానము కూడ మనిషి తనదేననుకొంటున్నాడు.

ఎన్నో శరీరములలో జీవాత్మతో పాటు ఆత్మ కూడ ఉంటూ ఆ శరీరమునకు జీవన విధానమును కలుగజేయుచున్నది. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆత్మగ ఉంటూ అన్ని శరీరములలోనూ ఒకే ఆచరణ సూత్రము కల్గిఉన్నది. ఆత్మ అంశ ఒకటే అయినప్పటికీ అన్ని శరీరములలో అన్ని ఆత్మలు గలవని చెప్పవచ్చును. ఒక్కొక్క శరీరములోని ఆత్మ ఒక్కొక్క విధముగ బయటి ప్రపంచమున ఉపయోగపడుచున్నది. ఒక్కొక్క మనిషిని ఒక్కొక్క రంగములో తీర్చిదిద్దుతున్నది. ప్రపంచములోని ఎన్నో రంగములలో ఎంతో గొప్ప వ్యక్తులుగ వారిలోని ఆత్మే చేసినది. ఎన్నో రహస్యములను తెలియజేసి మానవుల అనుభవములకు సంబంధించిన ఎన్నో సౌకర్యములు కలుగజేసినది. మానవుని సుఖముల నేపథ్యములో ఎన్నో పరిశోధనా విషయములను తెలియజేసి విమానము, టీవీ, కంప్యూటర్‌లాంటి పరికరములను అందించినది. మానవునికి ప్రపంచ సంబంధ విషయము

లను పరిశోధనల రూపములతో ఆత్మ తెలియజేయగా వాటిని నేనే కనుగొన్నానని మనిషిలోని జీవుడు అనుకొంటున్నాడు. ప్రతి క్రొత్త విషయములోను, ప్రతి క్రొత్త పరిశోధనలోను అన్నీ నావలననే జరుగుచున్నా యని అనుకోవడము మానవుని సహజత్వమై పోయినది.

ప్రతి శరీరములోని ఆత్మ ఆ శరీరమును అన్ని విధములా నడుపుచున్నది. కొన్ని శరీరములలో మాత్రమే ఆ శరీరములలోని ఆత్మలు ప్రత్యేకమైన పనులు చేయుచున్నవి. సచిన్‌టెండూల్కర్‌లోని క్రీడాప్రావీణ్యత గానీ, అబ్దుల్ కలామ్‌లోని పరిశోధనా సామర్థ్యముగానీ, మహాగాయకుడైన బాలసుబ్రమణ్యములోని గాత్ర ప్రావీణ్యతగానీ అన్నియూ వారి ఆత్మల ప్రత్యేకతేగానీ వారి ప్రత్యేకత ఏమీలేదు. ప్రపంచ సంబంధముగ అన్ని రంగములలో అభివృద్ధికొరకు ఆత్మయే క్రొత్తదనమును, ప్రావీణ్యతను, పరిశోధనాయుక్తిని అందించుచున్నది. విశ్వములో ప్రపంచము, పరమాత్మ అను రెండు తరగతులు గలవు. ప్రపంచ తరగతిలో ఎంతో పరిశోధన రూపముతో ముందుకు తీసుకపోయిన ఆత్మ మానవున్ని సుఖాలలోను మరియు దుఃఖములలోను ముంచెత్తుచున్నది. ప్రపంచ ప్రగతిలో ముందు కెళ్ళిన మానవుడు అంతా తన ప్రావీణ్యతేనని తలచుకొనుచున్నాడు. ప్రపంచ సంబంధమైన ఎన్నో రోగాలకు మందులను తెలియజేసిన ఆత్మ ఎన్నో సుఖములకు ఉపయోగపడు వస్తువులను కూడ తెలియజేసినది. ఇదంతయూ ప్రపంచ తరగతికి సంబంధించిన విషయములు. ప్రపంచతరగతికి సంబంధించిన అనేక విషయములు అందరి ద్వారా కాకుండా కొందరి శరీరములనుండే తెలియజేయబడినవి. ప్రపంచ విషయములే అతి జాగ్రత్తగ కొందరి ఆత్మలనుండే బయటపడగా పరమాత్మ తరగతికి సంబంధించిన విషయములు కొందరి శరీరములనుండి కాక ప్రత్యేకమయిన ఒక

శరీరమునుండే బయటపడును. ప్రపంచ సంబంధ విషయముల రహస్యములు ప్రత్యేకత కల్గిన కొందరినుండి బహిర్గతము కాగా, పరమాత్మ విషయము ఒక శరీర ఆత్మనుండే బయల్పడునని మరువకూడదు. పరమాత్మ వివరములు రహస్యములు తెల్పు ప్రత్యేకమయిన ఒకేవొక ఆత్మగల వ్యక్తినే **"భగవంతుడు"** అనుచున్నాము. పరమాత్మ విషయములు ఒక్క భగవంతుని ఆత్మకు తప్ప ఎవరికీ తెలియవు. మూడవ పురుషుడైన పరమాత్మ విషయములను ఒక్క భగవంతుని ఆత్మయే తెలుపవలసి ఉన్నది. భగవంతుడు కాక మిగతా మనుషులలోని ఆత్మలు ప్రపంచములోని ఎంత గొప్ప విషయమునైనా తెలుపవచ్చును.

జగతిలో భగవంతుడై వచ్చినవాడు శ్రీకృష్ణుడు. పరమాత్మ స్వయముగా భూమి మీద జన్మఎత్తినపుడు ఆ జన్మను భగవంతుడనవచ్చును. పురాణాల పద్ధతి ప్రకారము రాముడు కూడ భగవంతుడని అనుచున్నారు. ఇక్కడ శాస్త్రమును తప్ప పురాణములను తీసుకోకూడదని మనవి. పరమాత్మ కృష్ణునికంటే ముందు ఏ జన్మ ఎత్తినది ఎవరికీ తెలియదు. దశావతారములు శ్రీమహావిష్ణువియని చెప్పుట గలదు. ఆకారము, పేరు గల విష్ణువును గూర్చి చెప్పిన జన్మలు కాక, ఆకారము పేరు లేని పరమాత్మను గూర్చి చెప్పిన జన్మల గురించి మేము చెప్పుచున్నామని తెలియవలెను. ప్రపంచ మంతా ఆవహించి అందరిలోపల గల పరమాత్మ స్వయముగ భగవద్గీతను తెల్పి అందులో ఎన్నో ఆధ్యాత్మిక రహస్యములను తెలియజేశాడు. మానవునికి తెలియని ఎన్నో రహస్యములు భగవంతుని ఆత్మద్వారా బయటికి వచ్చినవి ఆ రహస్యములలో మనిషి చావును గురించిన విషయము, పుట్టుకను గురించిన విషయములు గలవు. వాటిలో ఇక్కడ మరణ రహస్యమును మరణ సిద్ధాంతముగ, జన్మరహస్యమును జననసిద్ధాంతముగ తెలియజేయుచున్నాము. పుట్టినపుడు జ్ఞాపకముంటేగానీ జననరహస్యము,

చచ్చినపుడు జ్ఞాపకముంటే గానీ మరణరహస్యమును చెప్పవచ్చును. ఎవరికీ జ్ఞాపకము లేనిది, ఎవరికీ తెలియనివి నీవెట్లు వ్రాయుచున్నావని ఇతరులు అడుగకుండ జననసిద్ధాంతము భగవద్గీత సాంఖ్యయోగములో 22వ శ్లోకము **"వాసాంసి జీర్ణాణి యథా విహాయ నవాని గృహ్ణాతి నరో ప రాణి, తథాశరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవానిదేహీ"** అను దాని ప్రకారము వ్రాశానని చెప్పుచున్నాము. అలాగే మరణ సిద్ధాంతము కూడ అక్షర పరబ్రహ్మయోగము ఆరవ శ్లోకము **"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్, తం తమే వైతి కౌంతేయ! సదా తద్భావ భావితః"** అను దాని ప్రకారము వ్రాశానని తెలియజేయుచున్నాము.

ఆత్మ ఎంతటి రహస్యమునయినా తెలియజేయును. ప్రత్యేకించి భగవంతుని ఆత్మ, పరమాత్మ విషయములను తెలియజేయును. భగవంతుని ఆత్మ తెల్పిన విషయములనే ఇంతకు ముందు ఎన్నో తెలియజేశాము. ఇపుడు కూడ భగవంతుని ఆత్మ తెల్పిన విషయములే తెలియబరుచు చున్నామని అసూయలేకుండ అర్థము చేసుకోగలరని అనుకొంటున్నాము. ముఖ్యముగ భగవంతుడు తెల్పిన అన్ని విషయములను మాయలోనున్న మనిషి అంత సులభముగ నమ్మలేడు. జనన మరణ రహస్యములు కూడ అటువంటివే కావున జాగ్రత్తగ పరిశీలించవలెనని కోరుచున్నాము. కొంత చదివి వెంటనే ఒక నిర్ణయానికి రాక పూర్తి చదివి అర్థము చేసుకోవలెనని తెల్పుచున్నాము. జనన మరణముల వివరములు రహస్యములు కావున అవి క్రొత్తగ కనిపించి నమ్మ లేనట్లుండును. అందువలనే ఇంత వివరము చెప్పవలసివచ్చినది. జనన మరణ విషయలన్ని భగవంతుని ఆత్మ నుండి తెలుపబడిన విషయములే నని, జీవాత్మనైన నావి కావని తెలియవలెను. ఇపుడు మరణము గురించిన వివరము చూస్తాము.

మనిషికి మరణము రెండురకములు గలవు. ఒకటి అకాల మరణము, రెండవది కాలమరణము అంటాము. **పూర్తి శరీరమును వదలక శరీరములోని పది భాగములను మాత్రము వదలిన వారి మరణమును అకాలమరణము అంటాము. అకాలమరణము పొందినవారు మిగతా 14 శరీరభాగములతో జీవిస్తునే ఉందురు. పూర్తిగ 24 భాగములను వదలిన వారిది కాలమరణమగును.** అకాలమరణము పొందిన వారు మనకు కనిపించకుండ జీవించియే ఉన్నారు. కనుక అది పేరుకు మరణమే కాని పూర్తిమరణము కాదని తెలియవలెను. కాలమరణము పొందినవారు మాత్రమే పూర్తి శరీరమును వదలి మరుజన్మకు పోవుదురు. అటువంటి మరణమును గూర్చి ఇపుడు తెలుసుకొందాము. మరణము అంటే అర్థము ముందే తెలుసుకొన్నాము. మరణసమయములో ఏమి జరుగుచున్నదో, ఆ సమయములో జీవుడు ఏ అనుభూతిపొందుచున్నాడో, పరిస్థితి ఎలాగుండునో, జీవుడు శరీరమును ఏ విధముగ వదలి పోవుచున్నాడో తెలియవలసి ఉన్నది. శరీరము జీవునితో సహా మొత్తము 25 భాగములుగ నున్నది. జీవుని తర్వాత ఉన్న 24 భాగములను శరీరములోని ఆత్మయే శక్తినిచ్చి నడిపిస్తున్నది. శరీరములోని ఆత్మ పరమాత్మలను భాగములుగ లెక్కించడములేదు. శరీర భాగములుగ లెక్కించుటకు ఒక సూత్రముగలదు. శరీరములో ప్రత్యేకమయిన పనులు చేయునవి జీవునితో సహా మొత్తము 25 గలవు. ఆత్మ అన్నిభాగములకు శక్తినిచ్చి ఆడించుచు శరీరమంత వ్యాపించి ఉండుటవలన దానిని భాగముగ గుర్తించుటకు వీలులేదు. **25 భాగములుగనున్న శరీరమును "సజీవ శరీరము" అంటాము. 25 భాగములలో 10 భాగములయిన పై శరీరమును "స్థూల శరీరము" అంటాము. 15 భాగములయిన లోపలి శరీరమును "సూక్ష్మ శరీరము" అంటాము.** శరీరము స్థూల, సూక్ష్మమని రెండురకములుగ గలదు. భూమి

మీద స్థూలశరీరము లేకుండ సూక్ష్మశరీరముండగలదు గాని, సూక్ష్మ శరీరము లేకుండ స్థూల శరీరముండలేదు. స్థూలశరీరమును పైశరీరమని సూక్ష్మశరీరమును లోపలి శరీరమని కూడ చెప్పవచ్చును. లోపలి శరీరములోనే జీవాత్మ కూడ ఉండును. జీవాత్మ ఉన్నటువంటి లోపలి శరీరము పోతే పై శరీరము మృతదేహమగును. లోపలి శరీరమున్నంత వరకే పై శరీరమునకు విలువ ఉండును. లోపలి శరీరము లేకపోతే పై శరీరము చచ్చిన శరీరమై చెడిపోవును. స్థూల, సూక్ష్మశరీరములైన సజీవ శరీరమును గురించి తెలుసుకొన్న తర్వాత మరణమును గురించి సులభముగ తెలియవచ్చును.

ఇంటిలో ఫ్యాను గాలినివీస్తుంది, లైటు వెలుతురునిస్తుంది, టీవీ సినిమాను చూపగలదు. ఇవన్నియు వాటిపనిని బట్టి విడి విడి పరికరములే అయినప్పటికీ, అన్నిటికి ఒక శక్తి అవసరము. అదియే విద్యుచ్ఛక్తి. అలాగే శరీరమను ఇంటిలో 25 పరికరములు గలవు. అన్ని వేరు వేరు పనులు చేయుచున్నప్పటికి అన్నిటికి ఒక శక్తి అవసరము అదియే ఆత్మశక్తి. ఆత్మశక్తి అన్ని అవయవములకు ప్రసరించుచు వాటి చేత వివిధ పనులు చేయిస్తున్నది. శరీరము యొక్క బయటి అవయవములకు గాని, లోపలి అవయవములకు గాని ఆత్మశక్తియే ఆధారమై ఉన్నది. ఇది సజీవ శరీరమునకున్న విధానము. శరీరమునకు ఆయుష్షు అయిపోయినపుడు మరణము ఆసన్నమగును. మరణము వచ్చు సమయము వరకు శరీరములో అన్ని అవయవములు పని చేయుచుండును. శరీరములో ప్రతి పనిని ఆత్మచేయిస్తున్నదని చెప్పుకొన్నాము కదా! ఒక శరీరములో ఒక పని జరిగిందంటే ఆ పనిలోని కష్టమునుగాని, సుఖమునుగాని ఆ శరీరములోని జీవుడు అనుభవించుటకే నని తెలియాలి. ఉదాహరణకు దారిలో ఒకనికి పదికేజీల బియ్యము మూట దొరికిందనుకొనుము, ఆ మూటను వాడు రెండు కిలోమీటర్లు

మోసుకపోవలసి ఉన్నది. మూటను మోసుకపోవునపుడు బరువు బాధను కూడ అనుభవిస్తున్నాడు. ఈ కార్యములో జీవుడు కొంత సుఖమును, కొంత బాధను రెండిటినీ అనుభవిస్తున్నాడు. ఈ కార్యము జరుగుటకు ఉపయోగపడిన శరీర భాగములన్నిటికి ఆత్మశక్తి ఆధారమైనది. ఆత్మ తనశక్తి చేత ఆ కార్యము చేయించినా జీవుడు కొంత ప్రారబ్ధకర్మను అనుభవించడము, కొంత ఆగామికర్మను సంపాదించుకోవడము జరిగినది. జరిగిన కార్యము అందరికి కనిపించినప్పటికి కార్యము జరుగుటకు కారణమయిన ప్రారబ్ధము ఎవరికీ కనిపించదు. అలాగే కార్యములో ఉత్పన్నమైన ఆగామికర్మ కూడ ఎవరికీ కనిపించదు. ఆత్మయే అన్ని పనులను చేయిస్తున్నప్పటికి ఆత్మ అలా చేయించుటకు కూడ ప్రారబ్ధకర్మ కారణమై ఉన్నది. అందుకే వివిధ కర్మలున్న మనుషులచేత వివిధరకములుగ ఆత్మ పనిచేయుస్తున్నది. అలా చేయించుట వలన జగతి అంతయు చిత్ర విచిత్రమైన పనులు కనిపిస్తున్నవి.

అనేక రకములుగ పనులు జరుగుచున్న జగతిలో చేస్తున్న ఆత్మగాని, చేయిస్తున్న కర్మగాని, ఎవరికీ కనిపించవు. అనుభవిస్తున్న జీవుడు మాత్రము తనస్థితి తాను తెలుసుకోలేక జరుగుచున్న అన్నిటికి నేనే కర్తననుకొను చున్నాడు. శరీరములో కర్మచేయించడము, ఆత్మచేయడము తెలియని జీవాత్మ నేనే కర్తననుకోవడము ఎలా జరుగుచున్నదో ఉదాహరణగ విశదపరచుకొని చూస్తాము. ఇంతకుముందు పదికేజీల బియ్యము మూట విషయము చెప్పుకొన్నాముకదా! దాని విషయమే చూస్తాము ఒకడు కూలీనాలీ చేసి కొంతడబ్బును కూడబెట్టుకొని ప్రక్క ఊరిలో గవర్నమెంట్ స్టోరులో రెండు రూపాయలకు కేజీప్రకారము పది కేజీల బియ్యమును తీసుకొని తన ఊరికి పోవుచుండెను. దారిమధ్యలో బహిర్భూమికి పోవలసివచ్చినది.

బహిర్భూమికి అంటే ఏదో యుద్ధరంగానికి అనుకోవద్దండి కాలకృత్యములు తీర్చుకొనేదానికని అర్థము. బియ్యము మూటనెందుకు వెంటతీసుకొని పోవాలని దారిప్రక్కన పెట్టి కొంతదూరములో ఒక పొద చాటుకు పోయి కూర్చొన్నాడు. అంతలోనే మరొకడు ఆ దారిలో రావడము, ఆమూటను చూడడము జరిగినది. వాని శరీరములోని కన్నుల చూపు ఆ మూట మీద పడినవెంటనే కన్నుల వరకు వ్యాపించివున్న మనస్సు ఆ విషయమును తీసుకొని లోపలగల బుద్ధికి అందించినది. బయటి విషయమును గ్రహించిన బుద్ధి లోపలే తన చుట్టుగల గుణములతో యోచించను మొదలు పెట్టింది. గుణములు మంచి చెడు రెండురకములుగ ఉండును గనుక బుద్ధికి రెండురకముల ఆలోచనలు వచ్చినవి. అవి ఇలా ఉన్నవి.

**మంచిగుణము -- ఎవరిదో మూట క్రిందపడేసుకొని పొయ్యారు.**

**చెడుగుణము -- ఎవనిదయితే ఏమి, ఇపుడు ఎవరూ లేరు కదా! తీసుకో.**

**మంచిగుణము -- మూటపడిపోయిన విషయము తెలిసి తిరిగి వచ్చి తీసుకపోవును. మనమెందుకు తీసుకోవాలి? వద్దు.**

**చెడుగుణము -- ఎవరూ లేనపుడు దొరికినది మనసొమ్మే తీసుకో.**

**మంచిగుణము -- పోగొట్టుకొన్నవాడు వచ్చిచూచి ఎవరో ఎత్తుక పోయారని బాధపడును కదా!**

**చెడుగుణము -- పోగొట్టుకొన్నది వాని తప్పే. దొరికితే తీసుకో కూడదా!**

**మంచిగుణము -- పోగొట్టుకొన్నవాడు నా సొమ్ము పోయింది కదా! అని బాధపడును.**

**చెడుగుణము -- ఎవడో బాధపడునని దొరికిన దానిని విడిచి పెట్టెదమా?**

**మంచిగుణము -- ఇది చెడుపని తీసుకోవద్దు.**

**చెడుగుణము -- మంచి చెడు అని నీతికి పోతే బ్రతుకలేవు, ముందు తీసుకో!**

ఇలా రెండురకముల గుణముల వలన బుద్ధి యోచించగ ఆ పని జరిగేదో, జరక్క పోయేదో కర్మను బట్టి నిర్ణయముండును. ప్రారబ్ధ కర్మప్రకారము ఆ మాటను తీసుకపోయేది ఉన్నది. రెండురకముల యోచనలను బుద్ధి యోచించి ఎటూ నిర్ణయము చేయకుండును. బుద్ధి గుణములను బట్టి యోచించునదే గాని నిర్ణయము చేయునది కాదు. నిర్ణయము చేయునది బుద్ధి ప్రక్కనే ఉన్న చిత్తము. బుద్ధి యోచించిన విషయములలో ఒకదానిని చిత్తగించును. చిత్తగించడమునే నిర్ణయము చేయడము లేక ఒప్పుకోవడము అంటాము. చిత్తము మంచిదానినో చెడుదానినో ఏదో ఒక దానిని నిర్ణయించవలసి ఉన్నది. జీవుడు గత జన్మలలో చేసుకొన్న ప్రారబ్ధకర్మను బట్టి ఏది జరుగవలెనో ఏది జరుగకూడదో దానిప్రకారము చిత్తము చిత్తగించును. మూటను తీసుకొని కొంత సంతోషమును, రెండు కిలోమీటర్లు మోయుచు కొంత బరువు బాధను అనుభవించవలసి ఉన్నది కావున వానిలోని చిత్తము మూటను తీసుకొమ్మని నిర్ణయించినది. అపుడు ఆ వార్త చిత్తమునుండి మనస్సుకు చేరగ మనస్సునుండి బాహ్య కర్మేంద్రియములైన కాళ్ళు చేతులకు చేరును. మనస్సునుంచి వచ్చిన వార్తను కాళ్ళు చేతులు ఆచరిస్తున్నవి. ఇందులో జీవుని ప్రమేయము ఏమాత్రము లేదు. కార్యము మొదటిలో తనకేదో లాభమొచ్చినదని కొంత సంతోషపడడము, మోయుచున్నపుడు బాధను అనుభవించడము జీవుని పనియైనది. అనగా జరిగిన పనిలోని కష్ట సుఖముల

అనుభవించడము తప్ప పని జరుగుటలో ఏవిధమైన జోక్యము జీవునికి లేదు. ఈ కార్యమునకు మూలము ప్రారబ్ధకర్మకాగా అవయవములకు శక్తి నిచ్చినడిపించినది ఆత్మ. శరీరములోని బయటి కర్మేంద్రియములైన కాళ్ళు చేతులు కార్యములో ఉపయోగపడినవి. అంతేకాక జరిగిన పనికి నేనే కర్తననుకొన్నట్లు జీవునికి అహము బోధిస్తున్నది. అహము, చిత్తము ప్రక్కనే గలదు. అహము యొక్క భావమును పొందిన జీవుడు తనకు ఏమాత్రము సంబంధములేని దానిని నేనే చేశానని అనుకోవడము వలన కార్యములోని క్రొత్తకర్మ అయిన ఆగామికర్మ జీవునికి తగులుకొనుచున్నది. శరీరములోని జీవుడు, బుద్ధి, చిత్తము, అహము యొక్క ఆకారములను క్రింది పటములో చూడవచ్చును.

దారిలోని బియ్యము మూట దృశ్యము బుద్ధికి తెలిసినపుడు తల లోని గుణములు పనిచేసినవి. లోపల గుణములు మంచి చెడు వర్గములని




రెండు రకములుగ గలవు. చెడువర్గములోని ఆశ అనుగుణము బియ్యము మూటను గురించి యోచనలనివ్వగా దానికి వ్యతిరేఖ వర్గమయిన మంచిగుణముల నుండి కూడ యోచనలొచ్చినవి. అప్పటి కర్మానుసారము నిర్ణయము జరిగినది. ఇక్కడ ఈ పనిలో ఆశ అను గుణము పనిచేసినది.

కొన్ని సందర్భములలో వేరు వేరు పనులందు ఆ కార్యమును బట్టి వేరువేరు గుణములు పనిచేయుచుండును. గుణములందే ఎల్లపుడు జీవుడు, బుద్ధి, చిత్తము, అహము నివాసము చేయుచున్నవి. గుణములందు జీవుడుండు చిత్రమును క్రిందగల పటములో చూడుము.




జీవుడు శూన్యమైన బయలుగ ఉండగ, ఆ బయలును బుద్ధిపొర చుట్టిఉన్నది. బుద్ధిపొర తర్వాత చిత్తముపొర ఉన్నది. చిత్తముపొర తర్వాత అహముపొర గలదు. ఈ విధముగ మూడుపొరల మధ్యన బయలుగ జీవుడు గలడు. మూడుపొరల మధ్యన ఉండుట వలన పొరలతో పాటు జీవునికి ఆకారమేర్పడినది. గుండ్రని ఆకారముతో బుద్ధి, చిత్త, అహము సమేతుడైయున్న జీవాత్మ మూడు గుణభాగములలో దేనియందో ఒకదానియందుండును. జీవున్ని తనయందుంచుకొన్న మూడు గుణములు వృత్తాకారము కల్గిన చక్రమువలె నున్నవి. మూడు గుణములకు మధ్య ఆత్మ ఇరుసువలె కలదు. ఆత్మ మూడుగుణముల చక్రమునకే గాక దానిపైన గల కర్మచక్రమునకు మరియు కర్మచక్రము పైనగల కాలచక్రమునకు దానికంటే పైనగల బ్రహ్మాచక్రమునకు ఇరుసుగ గలదు. బ్రహ్మా, కాల, కర్మ, గుణచక్రముల చిత్రమును తర్వాత పేజీలో చూడవచ్చును.

ఈ విధముగనున్న నాల్గుచక్రముల చట్రము నుదుటి భాగమునకు సమానముగ తల మధ్యభాగములో గలదు. క్రింది చక్రములోని జీవుడు అక్కడ గుణములందు చిక్కుకొని ఉండగా, పైన గల కర్మచక్రమునుండి కర్మక్రిందికి ప్రసారమగుచుండును. ఏకర్మ జరుగవలెనో సూచించు చుండును. ఈ విధముగ కాలమును బట్టి కర్మ, కర్మమును బట్టి గుణములు, గుణములను బట్టి పని జరుగుచుండును. బ్రహ్మనాడిని కేంద్రముగ చేసుకొని నాల్గు చక్రములకు ఇరుసుగనున్న ఆత్మయు, గుణచక్రములోని గుణములు శరీర భాగములుగ లెక్కించబడలేదు.




**బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చిత్రము**

దారిలో బియ్యము మూట దొరికిన కాలము, కాలచక్రము ననుసరించి మధ్యాహ్నము పండ్రెండు గంటల కాలము. అనుభవించవలసిన కర్మ, కర్మచక్రముననుసరించి కొంత సంతోషము దానికంటే ఎక్కువ బాధ అనుభవమునకు వచ్చినది. పనిచేసిన గుణములు గుణచక్రములోని ఆశ. జీవునికి వచ్చిన ఆగామికర్మ పాపము. ఈ కార్యములో పనిచేసిన శరీర

భాగములు బయట కాళ్ళు, చేతులు, కన్నులు, లోపలి మనస్సు, బుద్ధి, చిత్తము, అహము, జీవుడు.  ఇట్లు అనేక సమయములలో అనేకమైన ప్రారబ్ధకర్మ  శరీరము ద్వారా అనుభవింపబడుచున్నది.  జీవుడు అనుభవిస్తూ అహము చేత తిరిగి క్రొత్త కర్మ సంపాదించుకొనుచున్నాడు.  ఈ విధానము అందరి ఎడల జరుగుచున్నది.  పాతకర్మ అనుభవిస్తు క్రొత్తకర్మ సంపాదించు కొనుట వలన జీవుడు మరణించి తిరిగి క్రొత్తజన్మ ఎత్తవలసి వస్తున్నది. జనన, మరణములు కర్మవలననే తగులుకొనుచున్నవి.  ఇది జీవిత కాలములో జరుగు తతంగము.

మరణములోని శరీర అవస్థ తెలియుటకు జీవితకాలములో ఎట్లుండునో తెలియుట అవసరము.  కావున ఇంతవరకు సజీవ శరీరములోని కాల, కర్మ, గుణములు కార్యములు తెలుసుకొన్నాము.  జీవుడు, ఆత్మ, అవయవముల విషయము కూడ తెలుసుకొన్నాము.  ఇక మరణావస్థ విషయము చూచెదము.  బ్రతికినన్నాళ్ళు జీవుడు శరీరములో సుఖమునో, దుఃఖమునో అనుభవిస్తూనే ఉండును.  నిద్రసమయములో తప్ప మెలుకువ లోనూ, స్వప్నములోనూ ప్రారబ్ధకర్మ అనుభవమునకు వస్తూనేవుండును. కాలిలో ముళ్ళుగ్రుచ్చుకొనిన ఆ నొప్పి మనస్సు ద్వారా బుద్ధికి చేరి, బుద్ధి ద్వారా జీవుని అనుభవమునకు వస్తున్నది.  ప్రతి అనుభవమును చాలా స్పీడుగా జీవునికి చేర్చు యాంత్రిక వ్యవస్థ శరీరములో గలదు.  ఇటువంటి శరీర యంత్రాంగము మరణ సమయములో స్తంభించి పోవుటకు మొదలిడును.  ఆ సమయమునే **"అవసానదశ"** అంటాము.  జీవితములో శరీరమునకు ఐదు దశలు గలవు.  1) బాల్యము,2) యవ్వనము, 3) కౌమారము, 4) వృద్ధాప్యము, 5) అవసానము అని వాటి పేర్లు.  బాల్యదశ, యవ్వనదశ, కౌమారదశ, వృద్ధాప్యదశ కొన్ని సంవత్సరముల కాలముండగ అవసానదశ మాత్రము కేవలము ఐదు నిమిషములనుండి అరగంట

వరకుండును, కొందరికి కొంత ఎక్కువ తక్కువ కూడ ఉండగలదు. మొదటి బాల్యదశ మొదలుకొని వృద్ధాప్యదశ వరకు శరీరము లోపలి బయటి అవయవములు, కర్మ, గుణములు అన్నీ ఒకే విధముగ వాటి వాటి పనిచేయుచుండగా అవసానదశలో మాత్రము శరీరములోపలి, బయటి అవయవములలో మార్పులు కలుగుచు అన్నియూ పనిచేయక నిలిచి పోవును.

శరీరము యొక్క అన్ని దశలలో శరీరమంతా వ్యాపించి శక్తినిచ్చి అవయవములనన్నిటిని కర్మానుసారము నడిపించు ఆత్మ అవసానదశలో శరీరమంతా లేకుండా కొద్ది కొద్దిగా ముకుళించుకొనును. అవసాన సమయములో ఆత్మ ముకుళించుక పోవడము వలన మొదట వెంట్రుకలు చర్మము యొక్క స్పర్శ లేకుండాపోవును. ఆ సమయములో చీమలు కుట్టినా తెలియకుండా పోవును. తేలుకుట్టినా నొప్పి తెలియకుండపోవును. బ్రతికినన్నాళ్ళు అన్ని దశలలోను చర్మము ద్వారా తెలిసిన బాధలు అవసానదశలో తెలియకుండా పోవును. దీనిప్రకారమైతే జీవునికి అన్ని దశలకంటే అవసానదశయే బాధ లేనిదని చెప్పవచ్చును. శరీరమంతా ఉన్న ఆత్మ ముడుచుకపోవుట వలన కర్మేంద్రియములైన కాళ్ళు, చేతులు పనిచేయు స్థోమతను కోల్పోవును. అపుడు మనిషి కదలక, మెదలక మంచము మీద పడివుండడము మాత్రముండును. నోటి కదలిక శక్తికూడ లేకుండాపోవడము వలన మనిషి మాట్లడలేడు. కేవలము కర్మేంద్రియములు పనిచేయక, కొద్దినిమిషములు జ్ఞానేంద్రియములు పనిచేయుచుండుట వలన తన వద్దకు వచ్చిన మనుషులు కనిపిస్తుందురు, వారి మాటలు వినిపిస్తుండును. తాను మాత్రము ఎవరినీ పలకరించలేని స్థితిలో ఉండును. నోరు, కాళ్ళు, చేతులు పని చేయని దానివలన తనలో తాను మధనపడు

చుండును. అప్పటి వరకు శరీరము మీదగల నొప్పులు కూడ తెలియక పోవును. కాళ్ళ నొప్పులు కూడ కనిపించవు. శరీరములోపలి నొప్పులేమైనా వుంటే అవి మాత్రము తెలియుచుండును. తర్వాత కొంతసేపటికి అంతవరకు పనిచేయుచున్న జ్ఞానేంద్రియములైన కళ్ళు, చెవులు కూడ శక్తిహీనమైపోవును. అప్పుడు బయట ఎవరున్నది, ఎవరు ఏమి మాట్లాడుచున్నది తెలియకుండా పోవును. బయటివారు ఇదుగో నీచిన్న కొడుకొచ్చాడని చెప్పిన, దాచిన ధనమెక్కడ పెట్టినావని అడిగిన లోపలి జీవునకు విషయమే తెలియకుండును. కన్నులు తెరుచుకొని ఉండినా కనిపించకపోవుట వలన కనురెప్పకూడ కొట్టక చూస్తున్నట్లే బయటివారికి కనిపించుచుండును. అటువంటి సమయములో యమదూతలు వచ్చారని వారిని చూస్తున్నాడని, దూత దర్శనము చేత మన ధ్యాస పోయిందని కొందరనుకొనుచుందురు. అవసాన దశలోనున్న వారికి చూపే లేదని తెలియక యమకింకరులను చూస్తున్నాడను కోవడము పొరపాటు.

శరీరము బయటగల జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు పని చేయకపోవడము వలన బాహ్యాబాధలన్ని వదలిపోయినట్లే. బయటి ప్రపంచముతో పాటు మనస్సు కూడ బయటి ప్రపంచముతో సంబంధము తెగిపోయి లోపల ఇంద్రియములు పనిచేయుచుండును. ఆత్మతో పాటు మనస్సు కూడ బయటి ఇంద్రియములతో సంబంధము తెగిపోవడము వలన బయటి విషయములను బుద్ధికి అందించలేకపోవును. బుద్దికి బయటి విషయములు చేరని దానివలన యోచించనవసరమే లేకుండా పోయినది. బుద్ధికి యోచనలు లేనిదాని వలన చిత్తమునకు పనియే లేదు. ఏ పని జరగనందున అహమునకు కూడ పనిలేదు. అప్పటికీ మనస్సుకు ఆత్మశక్తి అందుచుండుట వలన మనస్సు తన నైజము ప్రకారము జరిగి

పోయిన పనులను గురించి జ్ఞాపకము తెచ్చుచుండును. క్రమేపీ మనస్సు కూడ బలహీనపడి పోవుచుండును. ఆ సమయములో మనస్సు అందించు కొద్దిమాత్రము జ్ఞాపకము తప్ప మనిషికి ఏ బాధగాని, ఏ చింతగాని లేకుండును. ఎన్నో శరీరబాధలు, మానసిక బాధలు కల్గి ఏమాత్రము శాంతి లేనివానికి జీవితములో ఎప్పుడూ చవిచూడని బాధరహిత స్థితిని అవసానదశలో జీవుడు పొందుచుండును. ఏ బాధలు, ఏ చింతలు లేని ఆ స్థితిని గూర్చి బ్రతికున్నవారు తెలియలేక, చనిపోవునపుడు జీవుడు ఎంత బాధ అనుభవిస్తున్నాడో అని అనుకొనుచుందురు. చివరకు మనస్సు కూడ శక్తిహీనమైపోవుచు చిన్న చిన్న విషయములను మరిచిపోవును. తనకున్న జ్ఞాపకశక్తి తగ్గుట వలన చాలా ముఖ్యమైన విషయములనూ, బాగా మనస్సుకు హత్తుకొనివున్న విషయములనూ జ్ఞాపకము తెచ్చు చుండును. ఆ విషయములనే బుద్ధి గ్రహించి జీవునకు తెలియజేయు చుండును. మనస్సు చివరి వరకు జ్ఞాపకాల పనియే చేయుచుండును. చివరకు మనస్సు అన్ని విషయములను మరిచిపోయి ఆఖరుకు తనకున్న గొప్పవిషయమేదో దానినొక్క దానిని జ్ఞాపకము తెచ్చును. అదియే మనస్సుకు చివరి జ్ఞాపకము. దానికంటే మించిన విషయము మనస్సు కుండదు. ఆ చివరి విషయమే బుద్ధి ద్వార జీవుడు గ్రహిస్తుండును. **జీవితములో దేనినయితే మనిషి గొప్పగ తలచి ఉండునో, ఏ విషయమైతే మనిషికి ప్రాముఖ్యముగ ఉండునో, ఏ విషయమును జీవితధ్యేయముగ, జీవిత సారాంశముగ పెట్టుకొని బ్రతుకుచుండునో ఆ విషయమే చిట్టచివరి జ్ఞాపకమగును.** చివరి విషయమును మనోఫలకము మీద బుద్ధి ద్వార జీవుడు చూచు చుండగ, ఆత్మ తనశక్తిని బుద్ధి, మనస్సునుండి కూడ ముకుళింపజేయుట వలన అన్ని అవయవములు స్తంభించిపోయినట్లు అవి కూడా లేకుండా పోవును. శరీరములో అంతవరకు అన్నిదశలలో పనిచేసిన 24 భాగములు

అంత్యమైపోవును. చివరకు శరీర భాగముగ పేరుగాంచిన జీవుడొకడు మిగులును. ఆత్మ శరీరమంతటి నుండి ముడుచుకొని తన నివాసకేంద్రమైన బ్రహ్మనాడిని చేరును. అపుడు శరీరమంత మృతమైపోయి తల మధ్యలో బ్రహ్మనాడియందు ఆత్మయు, గుణచక్రములో జీవుడును ఉందురు. ఆ స్థితి కొన్ని సెకండ్లు మాత్రముండి ఆత్మ బ్రహ్మనాడిని కూడ వీడి తనతో పాటువున్న నాల్గుచక్రములను తీసుకొని శరీరమును వదలి పోవును. అప్పటికి పూర్తి మరణము సంభవించినట్లగును. అవసానదశలో ముడుచు కొంటూ శరీర భాగములను వదలించుకొన్న ఆత్మ చివరకు తనతోపాటు జీవున్ని, వానిచుట్టువున్న గుణములను అనగ గుణచక్రమును, దానికి పైన గల కర్మచక్రమును మిగతా రెండుచక్రములను తీసుకొని మరియొక శరీరమునకు పోవును. ఈ విషయమునే భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తియోగమునందు ఎనిమిదవ శ్లోకములో **"శరీరం య దవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః, గృహీ త్వైతాని సంయాతి వాయుర్గన్ధాని వాశయాత్"** "ఆత్మ ఏ శరీరమునుండి బయలుదేరి, తిరిగి ఏ శరీరమందు తాను ప్రవేశించుచున్నదో అక్కడికి తనతోపాటు కామాది గుణములను, కర్మను, జీవుని, గాలి వాసనను తీసుకపోయినట్లు తీసుక పోవుచున్నది".

మరణించిన శరీరమునుండి ఆత్మ నాల్గుచక్రములతో సహా బయలుదేరుచున్నది. ఆత్మ నాల్గుచక్రములకు ఇరుసుగ ఉండుట వలన ఆత్మ ఎక్కడికి పోయినా, దానిని అంటిపెట్టుకొనియున్న నాల్గుచక్రములు పోవుచుండును. మనుషులకొక్కరికే గాక ప్రతి జీవరాసికి ఈ నాల్గు చక్రముల అమరిక ఉండును. ఏ జీవరాసి శరీరము మరణముపొందినా, దానిలోని ఆత్మ నాల్గుచక్రములతో సహా బయలుదేరి కంటికి కనిపించకుండా పోవుచున్నది. గాలిలో సువాసన కనిపించకుండ మరొక చోటికి ప్రయాణము చేసినట్లు ఆత్మ కూడ సూక్ష్మముగ పోవుచున్నది. ఆత్మ,

జీవాత్మ, గుణములు, కర్మ ఏవీ కనిపించునవికావు. అందువలన మన ముందరే అవి చనిపోయినవాని శరీరమునుండి పోయిన వాటిని మనము గుర్తించలేము. ఆత్మను ఆధారము చేసుకొన్న నాల్గుచక్రములు ఆత్మతో పాటు పోవుచుండుట వలన క్రిందిచక్రములో గల గుణములతో సహా జీవాత్మకూడ పోవలసి ఉన్నది. ఆత్మ జీవాత్మ రెండు జోడు ఆత్మలు. అందువలన ఒకటిపోతే మరివొకటి కూడ పోవలసిందే!

పూర్వకాలము నుండి మనుషులకు మరణకాలములో తెలియని రహస్యము ఏమనగా! ఆత్మ నాలుగుచక్రములతో బయటికి పోవుచున్న దను విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదు. ఏ గురువులు చెప్పలేదు, ఏ పుస్తకములలో వ్రాయబడలేదు. ఏ యుగములో కూడ నాల్గుచక్రముల వివరము ఎవరూ చెప్పకపోవడము వలన, ఈ విషయము క్రొత్తదగుట వలన జాగ్రత్తగ అర్థము చేసుకోవలయును. నీకు, నాకు అని తేడా లేకుండ ప్రతి జీవరాసి శరీరములోను తలయందు బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు గలవు. సూక్ష్మరూపమై జ్ఞానదృష్ఠికి గోచరించు వీటిని జ్ఞానముతోనే తెలియనగును. ఆధ్యాత్మిక విద్యలోనే అతి రహస్యమైన నాల్గుచక్రములను అర్థము చేసుకొంటే జనన మరణ రహస్యము సులభముగా తెలియును. పాఠకులకు కొంత అర్థమగుటకు సూక్ష్మముగనున్న నాల్గుచక్రములను, గుణచక్రమును, అందులోని జీవాత్మను వెనుక పేజీలో చిత్రరూపముగ చూపాము. ఇపుడు కర్మచక్రమును, కాలచక్రమును తర్వాత పేజీలలో చూడవచ్చును.

నాల్గుచక్రములలోని కాల, కర్మ, గుణచక్రముల విషయము కొంత అర్థమైవుండును. అన్నిటికంటే పైన గల బ్రహ్మచక్రము విశ్వము యొక్క ఆయుష్షుకు సంబంధించినది కావున దాని విషయము ఇపుడు మనకు

అనవసరము. పూవులోని వాసన కనిపించనట్లు, వాసన గాలితో కలిసి మరొక చోటికి పోయినట్లు మరణములో నాల్గుచక్రముల అమరిక క్షణాలమీద మరియొక శరీరమును చేరుచున్నది. వాస్తవముగ చెప్పాలంటే ఒకటి లేక రెండు సెకండ్లలో మరియొక శరీరమును చేరుచున్నదని చెప్పవచ్చును. ఇంకను వివరముగ చూస్తే మరణించబోవు వాని శరీరములో ఆడు శ్వాస పైకి క్రిందికి ఆడుచుండును కదా! అవసానదశలో ముక్కు రంధ్రములలో పైకిపోయి క్రిందికి వస్తున్న శ్వాస మరణముతో చివరిగ క్రిందికి వచ్చి తర్వాత ముక్కు రంధ్రములలో దూరదు. క్రిందికి వచ్చిన శ్వాస తిరిగి ముక్కు రంధ్రములలో దూరి పైకి పోవడము దాని సహజమైన పని అయినప్పటికి అలా మరణించిన శరీరములో దూరక వెంటనే ఆత్మ ప్రవేశించిన చోట శ్వాస శరీరములోనికి ప్రవేశించును. ఇక్కడ క్రిందికి




**కాలచక్రము**




**కర్మచక్రము**

వచ్చినది ఇక్కడే పైకి పోక, ఇక్కడ పోయినట్లే ఏమాత్రము ఆలస్యము చేయక అక్కడ వేరు శరీరములోనికి పోయినది. దీనిని బట్టి శ్వాస క్రిందికి పైకి ఆడుచునేవున్నది. మరణముతో పాత జాగాలో పైకి పోక క్రొత్త జాగాలో పైకి పోయినది. మరణించిన శరీరము నుండి, క్రొత్తగ పుట్టిన శరీరము వేల మైళ్ళదూరములో ఉండినప్పటికీ, తత్‌క్షణమే ఆత్మ అక్కడికి చేరగల్గు చున్నది. మరణించిన జీవుడు వెంటనే వేరొక శరీరమున ప్రవేశించుట వలన యమధర్మరాజు యమలోకము అను ప్రసక్తేలేదు. అటులయిన యమధర్మరాజు యొక్క ఉద్యోగమేమి కావలెనని కొందరడుగ వచ్చును.

మీరు ఊహించుకొన్న యమలోకముగాని, యమధర్మరాజుగాని కేవలము కల్పితము. మనము చేసుకొన్న పాపపుణ్యములన్నియు జన్మలలో భూమి మీదనే అనుభవించవలెను. పుణ్యము చేసిన వానికి స్వర్గము ఇచటే గలదు, పాపము చేసినవానికి నరకము ఇక్కడే గలదని తెలియాలి.

ఎంతదూరమైన ఒకటి లేక రెండు సెకండ్ల కాలములో పోవు ఆత్మ జీవాత్మలకు తాము ధరించెడి శరీరము ఫలానా ప్రదేశములో ఉన్నదని ముందే తెలిసియుండునా? అను ప్రశ్నకూడ కొందరికి రావచ్చును. దానికి జవాబు చూస్తాము. **మరణమునకు ముందు అవసాన దశలో మనస్సుకు చివరి జ్ఞాపకము ఏదయితే వచ్చియుండునో దానికి సంబంధించిన జన్మకలుగునని భగవద్గీతలో చెప్పబడినది.** చివరి జ్ఞాపకములను మొదట రెండు రకములుగ విభజించవచ్చును. పరమాత్మ సంబంధ జ్ఞాపకములన్నీ ఒక రకము, ప్రపంచ సంబంధమువన్నీ రెండవ రకముగ చెప్పవచ్చును. ఆఖరు జ్ఞాపకము **ఏ కోవకు** చెందినదో, దానిలోను అది **ఏ స్థాయికి** చెందినదో దాని ప్రకారము వచ్చేజన్మ ఉండును. దీనిని గురించి భగవద్గీత అక్షరపరబ్రహ్మ యోగము ఆరవ శ్లోకములో **"యం యం వాపిస్మరన్ భావం త్యజత్యన్తే కళే బరమ్! తం తమే వైతి కౌంతేయ!"** అన్నాడు. దీనిప్రకారము చివరిలో ఏ ఏ భావముండునో దానికి సంబంధించిన జన్మయే లభ్యమగును. చివరిలో ప్రపంచ సంబంధము జ్ఞాపకము వచ్చివుంటే ఆ భావమునకు సరిపడు జన్మ ఏ స్థలములో, ఏ ఇంటిలో కల్గియుండునో ఆయింటిలో జన్మించిన శిశువును ఆత్మ చేరగలదు. శరీరమును వదలిన వెంటనే చివరి మనో భావమునకు తగిన శరీరమెచట జన్మించి ఉండునో అచటికి ఆత్మ నేరుగా పోగలదు. జీవుని ప్రారబ్ధము ప్రకారము ఏ శరీరములో ప్రవేశించవలెనో ఆ శరీరములోనికే ఆత్మ ప్రవేశించుటకు తగిన కారణము

గలదు. అనుభవించవలసిన కర్మలను బట్టి, తెలియవలసిన జ్ఞానమును బట్టి, చేరవలసిన జీవున్ని బట్టి శిశుశరీరములోని మెదడులో అమరిక లుండును. మరణించిన వాని చివరి జ్ఞాపకమునకు క్రొత్త శరీరములోని అమరికలు సరిపడు శరీరమే ఆత్మకు గోచరమగును, అదియే గమ్యమగును. నీరు పల్లమునకు (తగ్గుకు) పారునట్లు ఆత్మ, మనస్సు చివరి జ్ఞాపకమునకు సరిపడు శరీరమునే చేరును. తాబేలు సముద్రము బయటికి వచ్చి ఇసుకగుంతలో గుడ్లు పెట్టిపోవును. కొద్ది రోజులకు ఇసుకలోనే గుడ్లు పిల్లలుగ మారి ఇసుక నుండి బయటికి వచ్చి సముద్రము వైపేపోవును. సముద్రము ఎక్కడున్నది కనిపించక పోయిన అటుప్రక్కకే ప్రయాణము సాగును. ఒకవేళ దారిమళ్ళించిన అది మాత్రము అటువైపే పోవును. సముద్రము తెలియనట్లు, దారిలేనట్లు ఒక పెద్దగోడను పర్లాంగుపొడవు కట్టినా, తాబేలుపిల్ల ప్రక్కదిశలకు పోక గోడపొడవున వచ్చి తిరిగి సముద్రము వైపే పోవును. అలాగే ఒక పావురమును వెయ్యిమైళ్ళ దూరములో వదలిన తన ఊరెటువైపు ఉన్నదో అటువైపే ప్రయాణము చేయును. అప్పుడే పుట్టిన తాబేలుపిల్ల ఎన్ని అడ్డంకులున్నప్పటికీ సముద్రపు దిశను గుర్తించు చున్నది. అట్లే దారి, దిశ తెలియని పావురము తన ఊరి దిశను సులభముగ గుర్తించుచున్నది. అలా గుర్తించు శక్తి వాటి శరీరములోని ఆత్మలకు గలదు. అట్లే ప్రారబ్ధకర్మకు తగిన శరీరమును మరియు చివరి యోచనకు తగిన మడతలు గల మెదడున్న శరీరమును ఆత్మ గుర్తించ గలదు.

మనిషి సంపాదించుకొన్న ఆగామికర్మ, సంచితకర్మలో కలిసి పోయివుండును కదా! మనిషి మరణించినపుడు సంచితములోనిది ప్రారబ్ధముగ ఎలా మారుచున్నది? అని కొందరడుగవచ్చును. దానికి సమాధానము, మరణసమయములో శరీరమంతా శక్తికోల్పోయి అన్ని

అవయవములు పనిచేయని స్థితిలో ఆత్మ ఊపిరితిత్తుల ద్వారా కొద్ది మాత్రము శ్వాసను ఆడిస్తు చివరకు మనస్సు యొక్క పనిని కూడ నిలిచిపోవునట్లు చేయును. ఆ సమయములో చివరగ తనకందిన దానిని మాత్రము జీవాత్మ చూస్తుండును. ఒక శ్వాస తప్ప, మనస్సు కూడ నిలిచిపోయిన తర్వాత ఆత్మ బ్రహ్మనాడిలో చేరి నాల్గుచక్రములతో సహా ఒక్క క్షణముండునని ముందే చెప్పుకొన్నాము. ఆ క్షణములోనే చివరి మనోదృశ్యమును బట్టి సంచితమునుండి ప్రారబ్ధమును ఆత్మ చేతనే ఎన్నుకోబడును. జీవునికి చివరి దృశ్యము అందనంతవరకు ప్రారబ్ధము నిర్ణయము కాదు. చివరి దృశ్యమును బట్టి ప్రారబ్ధము, ప్రారబ్ధమును బట్టి రెండవజన్మ శరీరము నిర్ణయించబడును. ఏ శరీరమును పొందవలసినది ప్రారబ్ధము నిర్ణయించగ, ప్రారబ్ధము జీవునికి వచ్చు చివరి మనోదృశ్యమును బట్టి నిర్ణయించబడును. చివరి క్షణములో సంచితమునుండి ప్రారబ్ధము నిర్ణయమైనపుడు ఆ సమయములోనే అంతవరకు సంపాదింపబడిన ఆగామికర్మ సంచితములో కలసిపోవును. సంచితము నుండి ప్రారబ్ధము తయారగుట మరియు సంచితములోనికి ఆగామికర్మ కలిసిపోవుట రెండూ ఒకే సమయములో జరిగిపోవును.

మనిషి తన జీవితములో ఏ విషయము మీద ఎక్కువ లగ్నమై బ్రతుకుచున్నాడో, ఏ విషయము మీద తన ఇచ్ఛ ఎక్కువగ ఉన్నదో, ఏ విషయమును ఎల్లప్పుడు తలచుకొనుచుండునో, ఆ విషయ జ్ఞాపకమే అవసానదశలో చివరిగ మనస్సుకు వచ్చి జీవునికి చేరును. ఎల్లపుడూ స్మరించుట చేత శరీరము వదలునపుడు అదే జ్ఞాపకము వచ్చి తర్వాత అదే స్థితిని పొందునని గీతలో కూడ చెప్పారు. **అంతేకాక ఎల్లపుడూ నన్నే స్మరించుము, చివరిగ నేనే జ్ఞప్తికి వచ్చి నాలోనికే ఐక్యమగుదువని దేవుడు**

**తెల్పడము కూడా జరిగినది.** ఈ విషయములను గీతలో అక్షర పరబ్రహ్మ యోగమను అధ్యాయము 7, 8, శ్లోకములలో " **తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ, మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్యస్య సంశయః** ". "అభ్యాసయోగ యుక్తేన చేతసానాన్య గామినా, పరమం పురుషం దివ్యం **యాతి పార్థాను చిన్తయన్**" దీని భావము నీ **మనస్సు, బుద్ధి అన్ని నాకే సమర్పించి, సర్వకాలములందు నన్నే స్మరించుచుండుము తప్పక నన్నే చేరగల్గుదువు. ధ్యానము, అభ్యాసము చేత మనసునందు నన్నే స్మరించుచుండుట వలన పరమము, దివ్యము అయిన నన్నే చెందగలవు.** అని గీతలో **ఉపాయము** కూడ చెప్పాడు.

జీవునికి తర్వాత జన్మ ఏదైన రావచ్చును గానీ, మరణించు సమయములో శారీరక, మానసిక బాధలనన్నిటి నుండి తప్పించుకొని ఏ బాధ పొందదని చెప్పవచ్చును. ఇంతవరకు మరుజన్మకు పోవువానికి అవసాన దశలో జరుగు విషయమంతా వివరముగ తెలుసుకొన్నాము. ఇది సర్వసాధారణముగ అందరికి జరుగు పద్ధతి అనుకొందాము. జీవితములో కర్మను అంటక, సంచితమును లేకుండ చేసుకొన్నవాడు మోక్షము పొందవలయును. కర్మశేషములేని మనిషి యొక్క మరణములో అవసానదశ ఎట్లుండునో తెలుసుకొందాము.

జగతిలో యోగులైన వారే పరమాత్మయందు ఐక్యమగుటకు అవకాశము గలదు. యోగులలో మూడు రకములు గలరు. వారు బ్రహ్మ యోగులు, కర్మయోగులు, భక్తియోగులు. యోగులకు చివరి గమ్యస్థానము పరమపదము. అంతటా వ్యాపించిన పరమాత్మలో కలియుటను మోక్షము చెందుట అంటున్నాము. బ్రహ్మయోగులు శరీరములోని మనస్సును నిగ్రహపరచుకొని యోగమాచరింతురు. కర్మయోగులు అహమును అణచి

యోగమాచరింతురు. **భక్తియోగులు చిత్తము వివరము తెలిసి దానిని తమ భావములో లేకుండా చేసుకొందురు.** ఈ విధానములచేత వారు పరమాత్మను చేరుటకు మార్గమును ఏర్పరచుకొనుచున్నారు. కర్మ ఏమాత్రము లేకుండ అయిపోయిన యోగులకు చివరి మరణము పొంది పరమాత్మయందు ఐక్యమగుదురు. యోగులైనవారు మరణించిన తర్వాత తిరిగి పుట్టరు. అటువంటి వారి మరణము జన్మలకుపోవు వారి సాధారణ మనుషుల మరణమువలె ఉండదు. మూడు రకముల యోగులు పరమాత్మను చేరుచున్నప్పటికీ వారి మరణము శరీరములో కొంత వ్యత్యాసముతో మార్పులు కలిగి పరమాత్మలో కలిసిపోవుట జరుగుచున్నది. మొదట బ్రహ్మయోగులు జీవితములో తమ మనస్సును అణచివేయడము వలన ఏ విషయచింతనలు మనస్సుకు రాకుండా అణిగిపోవడము అలవాటై ఉండును. మనోకార్యములను అణచివేసిన కాలమును బ్రహ్మయోగ కాలము అంటాము. జీవితములో ఎంతో కాలము బ్రహ్మయోగమును అభ్యాసము చేయుట చేత వారి మరణకాలములో అవసానదశయందు బయటి అవయవములన్నియు నిలిచిపోయి మనస్సు ఆత్మయందు లగ్నమై బుద్ధికి ఆత్మ విషయమును అందించుట చేత బుద్ధి ఆత్మ విషయమునే జీవునికి అందించును. అపుడు జీవుడు ఆత్మనే తెలియుచుండును. మనస్సు బుద్ధికి, బుద్ధి జీవునికి ఆత్మను తెలుపుచు మొదట మనస్సు బుద్ధియందు కలిసిపోవును. మనస్సు బుద్ధియందు లీనమై వేరుగ లేకుండపోవుట ఎప్పుడూ జరుగని అరుదైన సంఘటన. బ్రతికివున్న బ్రహ్మయోగులలో యోగ సమయమున మనస్సు ఆత్మ విషయమును బుద్ధికి అందించునప్పటికి అవి వేరు వేరుగ ఉండును. కానీ చివరి మరణములో మాత్రము మనస్సు బుద్ధియందు కలసి అంత్యమై పోవును. మనస్సుతో కలిసి ప్రత్యేకముగ ఏర్పడిన బుద్ధి చివరిగ జీవాత్మయందు కలసి లేకుండా పోవును. అపుడు

మనస్సు బుద్ధి జీవుడు ఏకముగ మారివుందురు. ఈ విధానము మోక్షము పొందు మరణములో బ్రహ్మ యోగులకు మాత్రము జరుగునని జ్ఞాపకము చేయుచున్నాము. మనోబుద్ధులతో కలసిన జీవుడు ప్రత్యేకముగ తయారై చివరకు ఆత్మయందు కలసి తాను కూడ లేకుండా నాశనమైపోవును. జీవునికి నాశనము అంతవరకు లేక చివరిలో నాశనమగుచున్నాడు కావున జీవున్ని క్షరుడని చెప్పారు. భగవద్గీతలో భగవంతుని చేత క్షరుడని చెప్పబడిన జీవాత్మ మోక్షము పొందు మరణములో క్షరమై తన ఉనికిని కోల్పోయి ఏమాత్రము లేకుండా పోవుచున్నది. ఎన్నో యుగములనుండి చావు పుట్టుకలను కొనసాగిస్తున్న జీవాత్మ చివరి మరణముతో తాను లేకుండ పోవుట వలన తర్వాత పుట్టు అవకాశమే లేదు. ఈ విధముగ జీవాత్మకు తెరపడిపోవుచున్నది. జీవాత్మ ఆత్మలో కలసి నాశనమైపోవునపుడు అంతవరకున్న ఆత్మ, ఆత్మగ లేక ప్రత్యేకముగ మారిపోయి శరీరములోనే యున్న పరమాత్మలోనికి కలిసి పోవుచున్నది. ఆత్మ పరమాత్మ అనుసంధానమై పోయి శరీరములో ఏమీ లేకుండ పరమాత్మ మాత్రము మిగిలిపోవుచున్నది. ఎపుడైతే జీవాత్మ ఆత్మలో కలియుచున్నదో అపుడే బయటి శ్వాస కూడ నిలచిపోవుచున్నది. ఈ విధముగ బ్రహ్మయోగుల చివరి మరణముండగ కర్మయోగుల మరణమెట్లున్నదో క్రింద చూస్తాము.

జీవితములో కర్మయోగమును సాధించిన యోగులు తమ అహమును అణిచివేయుదురు. అహము యొక్క పనిని తెలిసినవారై దాని ప్రకారము విననివారే కర్మయోగులు. కర్మయోగుల చివరి మరణ ములో అవసానదశయందు బాహ్య అవయవముల నుండి ఆత్మశక్తి లేకుండా పోవుట వలన శరీరము పట్టు తప్పిపోయి ఉండును. ఆ సమయములో మనస్సు దైవచింతన కల్గి దైవజ్ఞప్తిని బుద్ధికి అందించగా, బుద్ధి ఆ విషయమును జీవునికి అందించుచున్నది. బుద్ధి ద్వారా వచ్చిన దానిని

జీవుడు అనుభవములో పెట్టుకోగా మనస్సు బుద్ధియందు కలసి లేకుండ పోవుచున్నది. మనస్సుతో కలసిన బుద్ధి బ్రహ్మయోగులలోవలె జీవునితో కలియక **అహముతో** కలియుచున్నది. మనో, బుద్ధి, అహముతో కలసి రూపము మారిన అహము జీవునితో కలియుచున్నది. మనో, బుద్ధి, అహములను తనయందు లీనముచేసుకొన్న జీవాత్మ ప్రత్యేకముగ మారిపోయి ఆత్మయందు కలియుచున్నది. జీవున్ని తనయందు కలుపుకొన్న ఆత్మ చివరకు పరమాత్మయందు లీనమైపోవుచున్నది. అదియే కర్మయోగుల మోక్షము. మార్పుచెందిన జీవుడు చివరకు ఆత్మ ద్వారా పరమాత్మయందు చేరి విశ్వమంతయు అణువణువున వ్యాపించిపోవుచున్నాడు. ఇక్కడ గమనించవలసిన విషయమేమనగా! బ్రహ్మయోగులలో మనస్సు బుద్ధి యందు, బుద్ధి జీవునియందు, జీవుడు ఆత్మయందు, ఆత్మ పరమాత్మ యందు కలియగా, అహము మరియు చిత్తము యొక్క ప్రస్తావన రాలేదు. కర్మ యోగులలో మాత్రము కొంత మార్పుతో అహముయందు బుద్ధి కలియగ, అహము జీవునియందు కలియుచున్నది. ఇక్కడ చిత్తము యొక్క ప్రస్తావన రాలేదు. ఈ విషయమునకు తర్వాత జవాబిస్తాము. ఇపుడు భూమి మీద అరుదుగయున్న భక్తియోగులు మోక్షము పొందుట ఎలాగున్నదో విశదముగ చూచెదము.

మోక్షము పొందు చివరి మరణములో భక్తియోగమును అనుసరించిన వారియందు మొదట శరీరము స్తంభించిపోయి, ఆ తర్వాత మనస్సు పరమాత్మ ధ్యాసమీద నిలచి ఆ విషయమును బుద్ధికి అందించును. బుద్ధి జీవునికి అందించగ ఆ అనుభవములో జీవుడు నిలిచి ఉండును. అటువంటి సమయములో మనస్సు బుద్ధియందు కలసి అంత్యమైపోవును. తర్వాత బుద్ధి అహములో కలసి లేకుండపోవును. అపుడు ప్రత్యేకముగ

మారిన అహము **చిత్తము**లో కలసి లేకుండా పోవును. ప్రత్యేకమైన అహముతో కలసిన చిత్తము తాను కూడ వేరువిధముగ మారి జీవునియందు కలియు చున్నది. బ్రహ్మ యోగులలోని చివరి జీవునికంటే మరియు కర్మయోగులలో చివరి జీవునికంటే చిత్తమును కూడ కలుపుకొని మరీ ప్రత్యేకముగ మారిన జీవాత్మ ఆత్మలో కలసి నాశమైపోవుచున్నాడు. భక్తియోగులలో అలా జీవాత్మ నశించిన తర్వాత ఆత్మ పరమాత్మలో శరీరమందే కలసిపోవుచున్నది. ఈ విధముగ భక్తియోగులు చివరకు మోక్షముపొంది విశ్వవ్యాప్తముగ ప్రతి అణువులోను వ్యాపించి పోవుచున్నారు.

బ్రహ్మయోగులలో చివరి మరణమమందు అహము, చిత్తము ఏమైనవని, అట్లే కర్మయోగులలో చివరి మరణమందు చిత్తమేమైనదని కొందరడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! కర్మయోగులకు అహము మీద, భక్తియోగులకు చిత్తము మీద ధ్యాస ఉండుట వలన శరీరములలోనే అవి మిగిలిఉన్నవి. వాటి ధ్యాసలేని బ్రహ్మయోగులందు బుద్ధి జీవునితో కలసినపుడు అహము, చిత్తము రెండు లేకుండ పోవుచున్నవి. అలాగే కర్మయోగులందు అహము జీవునియందు కలసిపోయినపుడు చిత్తము కూడ నశించిపోయినది. భక్తియోగులందు అలాకాక అహము, చిత్తము రెండు మార్పుచెంది నశించినవి. కర్మయోగులలో మాత్రము చిత్తము సాధారణముగ నశించగ, అహము జీవునియందు మార్పు చెంది నశించినది. యోగులు కాక సాధారణ జీవులు చనిపోయినపుడు మనస్సు, బుద్ధి నశించినపుడే చిత్తము, అహము రెండు నశించినవని తెలియుము. మరుజన్మకు పోవువారి మరణములలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహము ఏ విధ మార్పులు చెందక ఎట్లున్నవి అట్లే శక్తి కోల్పోయి నశించును. ఇంతవరకు యోగుల శరీరములో జన్మలేని చివరి మరణము ఎలా జరుగుచున్నదో తెలుసు

కున్నాము. ఇక్కడ కొంత వివరము తెలియవలసినదేమనగా! యోగులైన వారందరికి ఇలాగే మరణము జరుగునా అని ప్రశ్నరావచ్చును. దానికి జవాబుగ యోగులైనంత మాత్రమున ఇలాంటి మరణము జరుగుటకు అవకాశములేదు. కర్మశేషము లేకుండ అయిపోయిన యోగులకు మాత్రమే జన్మలులేని ఆఖరు మరణము సంభవించును. అపుడే యోగులు మోక్షము చెందుదురు. యోగులైనంత మాత్రమున కర్మవుంటే దేవునియందైక్యము కాలేరు. సాధారణ మరణములు సంభవించును. కర్మశేషము లేనివారు చివరి మరణము పొందినపుడు బయటి ప్రజలు గ్రహించుటకు అవకాశము గలదు. అదేమనగా సంపూర్ణ యోగులైనవారు, కర్మలేకుండ చేసుకొన్నవారు, మరణించు సమయము దినములో పగలుగ ఉండును. నెలలో శుక్లపక్షమై ఉండును. సంవత్సరములో ఉత్తరాయణమై ఉండును. పగలు, శుక్లపక్షమి, ఉత్తరాయణము అయినప్పటికీ మరణించు యోగుల శరీరమున్న ప్రాంతము మీద సూర్యరశ్మి లేకుండపోతే వారిది చివరి మరణముకాదని, కర్మశేషమున్న దని, వారికి తిరిగి జన్మకలదని చెప్పవచ్చును. యోగులు కానివారు పగలు, శుక్లపక్షమి, ఉత్తరాయణము, సూర్యరశ్మి అన్ని కలసినపుడు చనిపోయిన ప్రయోజనము లేదని వారికి ఈ నిబంధన అమలు కాదని తెలియాలి. యోగులయిన వారికి మాత్రమే ఈ మరణ సమయ నిబంధన వర్తించునని తెలియునట్లు భగవద్గీత అక్షరపరబ్రహ్మయోగములో 23వ శ్లోకము "యత్రకాలే త్వనావృత్తి మా వృత్తిం చైవయోగినః, ప్రయాతా యాంతి తం కాలమ్ వక్ష్యామి భరతర్షభ " **" ఏ కాలములో చనిపోతే యోగులు మోక్షము పొందుదురో, ఏ కాలములో చనిపోతే తిరిగి పుట్టుదురో ఆ కాలములను గురించి చెప్పుచున్నాను "** అని చెప్పాడు ఈ శ్లోకములో ప్రత్యేకముగ "యోగినః" అన్నపదమును గుర్తుంచుకోవలెను. తర్వాత **ఎండవున్న, పగలు, శుక్లపక్షమి, ఉత్తరాయణములో చనిపోయిన యోగులు మోక్షము**

**చెందుదురని,** మేఘములు కప్పిన పగలు, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయణము లలో చనిపోయిన యోగులు తిరిగి **జ్ఞానప్రకాశము** కల్గి పుట్టుదురని భగవంతుడు చెప్పాడు. దీనిని బట్టి సాధారణ మనుషుల మరణములకు దేవుడు చెప్పిన కాలనిర్ణయము వర్తించదని తెలియాలి. ఇంతవరకు మరణము గురించి తెలుసుకొన్నాము. అది సాధారణ మనుషులయందెట్లున్నది మరియు బ్రహ్మ, కర్మ, భక్తియోగులలో కూడ ఎట్లున్నది వివరించుకొన్నాము. మరణమును గురించిన ఈ వివరము భూతకాలములో లేదని, భవిష్యత్తులో దీనిని మించిన వివరము ఎవరూ చెప్పలేరని సగర్వముగ చెప్పుచున్నాము. గర్వము అంటూనే పొరపడవద్దండి. గర్వమును నేను ఉపయోగించుకొన్నాను కాని గర్వము నన్ను ఉపయోగించుకోలేదు.

మరణమంటే ఎంతో భయము, తెలియనితనమున్న వారికి ఈ వివరములు బాగా ఉపయోగపడునని తలచుచున్నాము. పురాణాల మీద, గతకాలములో జడలుపెంచుకొన్న వారి మీద విశ్వాసమున్న వారు, వారు చెప్పినట్లు మరణకాలములో యమకింకరులను గురించి వ్రాయలేదే అని అదే నిజము, ఇది నిజము కాదు అనుకొంటే శాస్త్రబద్ధత లేని విషయముల నెందుకు నమ్ముచున్నారని మా వైపునుండి ప్రశ్నరాగలదు. భగవద్గీతలో ఎన్నో ప్రమాణములతో స్వయముగ భగవంతుడు చెప్పిన విషయమునే విపులముగ వివరించాము.

ఈ గ్రంథములో చెప్పబడిన **"జనన మరణ రహస్యములు"** గత కాలములో ఎవరూ చెప్పియుండలేదు. రాబోవు కాలములో దీనిని మించి ఎవరూ చెప్పనూలేరు.

**ఇప్పటికయినా అందరు జనన మరణముల సత్యము**
**తెలుసుకుంటారని నమ్ముచూ ముగిస్తున్నాము.**

# JANANA MARANA SIDDHANTHAMU

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































